శ్రీమత్పరదేవతాయైనమః.

# పీఠిక.

చదువరులారా!

నేనీపద్యములను వ్రాయుటకుఁ గారణము నాకుఁగల చిక్కులే కాని పెద్దకవినని లోకమునకుఁ జాటుటకుఁ గాదు. ఆచిక్కెట్టిదియో యీయాపద్యములయం దచ్చటచ్చట స్ఫుటమగుచునే యుండును గాన నేనిట వేఱుగ వ్రాసికొనవలసినపనిలేదు. వ్యాధిరూపమైనచిక్కునకు నౌషధసేవ చేయవలయునేకాని పద్యములు వ్రాసికొనిన నేమి ప్రయోజనమని కొందఱనవచ్చును. కాని మనపూర్వులు వ్రాసిన రీతి యిది.

"పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే।
తచ్ఛాంతి రౌషధైర్దానైర్జపహోమసురార్చనైః॥"

పూర్వులు సురార్చనమును గడపటిసాధనముగా వ్రాసియుండఁగా మాపరమగురువులు దానికే కొన్నివిషయములయెడఁ బ్రాధాన్యమునిచ్చిరి చూడుఁడు.

మ. పడిసెంబో, తలనొప్పియో, జ్వరమొ సంప్రాప్తించుచో వైద్యులం
దడవన్ లాభముగల్గినన్ గలుగు దుర్దాంతవ్యథాభారముల్
గుడువన్ దాపగుచోనటుండెటేఁగి తాఁ 'గుయ్యో మొఱో' యంచు నీ
యడుగుల్ వట్టుట యేరుజాపనయనోపాయమ్ము కామేశ్వరీ.

పై వారియుపదేశమునకుఁ దార్కాణగా నాకు నౌషధసేవకంటె దైవతారాధనమే యుపశాంతినిచ్చినది. ఇంతకును భావనముఖ్యము.

"భావనా యది భవేత్ఫలదాత్రీ మామకం నగరమేవ హి కాశీ"

అని యభియుక్తోక్తి. సరియే. మహాకవులగు మయూరాదులు నిరాఘాటపాండిత్యముతోపాటు నిరర్గళవాక్సుద్ధికూడఁ గలవారగుటచే నట్లొనర్తురుగాక. యేవో రెండు జల్లిపదములనెట్లో జతకూర్చి నీవుగూడ

నట్టిప్రయత్నమునే చేయుదువా? యని యెల్లరును గాకున్నను వృథాకలహాకాంక్షులగు కొందఱు నన్ను నెగతాళి చేయుదురని యెఱుఁగుదును. నన్నెగతాళి చేయువారు చాల సుప్రసిద్ధులు. నేనో,

"వానివానరజంబుఁబోలనివాని నన్ను మనుష్యసం।
నాఁడెఁగోరుఁగఁజన్న"

అను తెగలోవాఁడను వారు సంస్కృతాంధ్రపాండితికలవారు. నేనో పొట్టకూటికై యితరభాషనభ్యసించుచు,

"స్వస్థానవేషభాషాభిమతాః"

అను దానిననుసరించి యెట్లో రెండుతెలుఁగుముక్కలకై యత్నించి కృతార్థతనందనివాఁడను. ఇట్టిస్థితిలోనున్న నన్ను విమర్శించుట యనుపేరున మందలించుట నాపూర్వజన్మపుణ్యముకాక వేఱుండదని భావించుచు నవ్వారికి మనఃపూర్వకముగా నెల్లపుడు నమస్కరించెదను.

"కాకిబిడ్డ కాకికిముద్దు"

అను సామెతనుబట్టి యితరులకు బాగుగ నుండకున్నను నెవని కవిత్వము వానికి బాగుగనుండవలయును. నాకవిత్వముపై దానికి భిన్నముగా నాకే బాగుగనుండదు. దీనినితరులెట్లు మెచ్చికొందురు. అగుచో మానవలయునే! మానుచో దైవతారాధనమెట్లు? ఊరక వచనరూపమునఁజేయరాదా? పద్యములేల? ఇట్లనేకములు ప్రశ్నలు వచ్చునని నేననుకొనుచున్నాను. ఈపద్యరచన నాకభ్యాసార్థమని తజ్ఞులు నన్ను క్షమింపఁగలరు. ఎన్నఁటికేని మంచికవినగుదునేమోయనియాశ.

"యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః"

ఇంతతో ముగించుచున్నాఁడను.

రామసుబ్బారాయుఁడు.






# ఆరోగ్య వేంకటేశ్వర శతకము.

ఉ. శ్రీకరసౌఖ్యసంపదలు చేకుఱునంచు మదిం దలంచి స
త్ప్రాకటభక్తిమీఱునటు ప్రస్తుతిసేయఁగ నెంచినాఁడ ని
న్నోకరుణాసముద్ర! మహితోన్నత దివ్యపదంబునందఁగా
నీకరుణాకటాక్షమును నిల్పుము, నాపయి వేంకటేశ్వరా! 1

చ. తిరుపతి వేంకటేశ కవిధీవరు శ్రీపదకృష్ణమూర్తినిన్
వరగుణుఁడౌ నృసింహకవి భద్రుని శ్రీయుత రామనాథునిన్
గురుతరభక్తిభావములు గూర్చి భజించుచునుంటి నాత్మలో
గురులనినమ్మి నేఁడిపుడు గోరిభజింతును వేంకటేశ్వరా! 2

చ. అనుదినమున్ భజించెద సమంచితభక్తిని దాల్చుచుండి నా
జనకుని రామనాథుని ప్రసన్నదయాపరుఁ రామభక్తునిన్
మనమునమాటిమాటికిని నన్నును నాదగు భార్యనున్ గుమా
రునిపయినుండిచూడుమని ప్రోవుమటంచును వేంకటేశ్వరా! 3

ఉ. మ్రొక్కెదసోమనాథునకు మ్రొక్కెదనిత్యమురామయాఖ్యునిన్
మక్కువమీఱనంజలి సమంబుగఁదాల్చి విశేషభక్తితో
మ్రొక్కెదరామమాంబకును మ్రొక్కెద శ్రీయుతలక్ష్మిదేవికిం
పెక్కనభక్తితోడ నను నెమ్మెయిఁజూడఁగ వేంకటేశ్వరా! 4

ఉ. మోదముతోడభక్తిమెయి మ్రొక్కుచునుంటినిదోసిలొగ్గి నా
సోదరునప్పయాఖ్యుని విశుద్ధచరిత్రుని దైవభక్తునిన్
నాదగు మిత్రబాంధవుల నమ్మిభజింతుమదాత్మలోన నీ
వే, దయసూపఁగావలయు వేగమప్రోవుము వేంకటేశ్వరా! 5

ఉ. నాదగుప్రాణమిత్రులను నమ్మిభజించెద నాత్మలోపలన్
శ్రీదయివారసౌఖ్యతతి జేరునటంచుఁ దలంచి భక్తిమై
మోదముగూర్చి నాజనని పుణ్యవతీసతిఁ సుబ్బమాంబనున్
నాదయితామణీయుతుడనై భజియించెద వేంకటేశ్వరా! 6

ఉ. నాకును నాదుభార్యకును నాదగుపుత్రుఁడు వేంకటేశుకున్
బ్రాకటసౌఖ్యసంపదలు బాగుగలేవని మద్గురూత్తమున్
శ్రీకరవేంకటేశ కవిసింధునివేఁడితి భక్తిభావముల్
ప్రాకఁగఁజేసి యాపయిని భవ్యపదంబుగనంపె దీవనల్. 7

మ. తనపుత్రుండటు రోగబాధలకు సంతాపించి స్రుక్కంగఁజే
యనుదానద్దియ మాయజేయవలెనంచారోగ్య కామేశ్వరీ
యను గ్రంథంబునువ్రాసెనక్కతననే యారోగ్యముంగల్గఁ బు
త్రునకున్ నాకదియందఁజేసెమిగులన్ దోరంపు ప్రేమంబునన్.

ఉ. దానినిజూచియంతయు యథావిధిభక్తిఁబఠించితంతఁ బ్ర
జ్ఞానిధిలేకపోయినను గల్గెమనమ్మున మద్గురూత్తమున్
శ్రీనియమంబుదాల్చుచు భజించెదుగోర్కె; యతించితీవిధిన్
దానసుఖంబుగల్గునని తథ్యముసెప్పితి వేంకటేశ్వరా! 9

ఉ. అందినలేఖఁజూచి తమరంతగ ప్రేమరసంబు నాపయిన్
జెందఁగఁజేసి శీఘ్రమొరచించిరె పద్యముతోడ నాశిషం
బందెఫలించెఁగోరికలు హర్షపయోధిని మున్కవెట్టితిన్
డెందమునందు మిమ్మెపుడు దీర్చిభజించెద దైవమోయనన్.

మ. భవదత్యంతకృపారసంబుఁ జిలుకన్ బ్రాప్తించె నారోగ్యమై
భవకాంతుల్, ప్రసరించెబుద్ధి, తనరెన్ భాగ్యంబు, లోలోపలన్
దెవులున్ బోఁదొడగెన్ సుఖంబుగలిగెన్ దేజస్సుహెచ్చెన్ [వెసన్
నవనీతంబగు నీహృదబ్జమెపుడున్ నాయందునిల్పన్గదే. 11

శా. భావంబందుననిన్ను సద్గురునిగాభావించి పూజించెదన్
నీవేనన్ను సముద్ధరింపగల సుస్నేహప్రభావంబునన్
బ్రోవంగాఁగలమేటిమిత్రుఁడవు నాపూఁబోఁడియున్ మీరలే
దైవంబంచు భజించుచుండెనెడఁదన్ ధర్మంబుగాపాడుచున్.

మ. భవదత్యంతకృపాకటాక్షకల నాభాగ్యంబు నాకబ్బుటన్
గవితాధోరణికొంతనాకు దొరకంగా మిత్రులంగూడి నీ
కవితాసారముగ్రోలుచుంటి నెపుడున్ గాలంబునెట్టంగ, సం
భవమయ్యెన్గద తెల్విమీరటుల నాపట్టై ప్రకాశింపఁగన్.

శా. నీవేనాదగుదైవమంచు నెదలో నిక్కంపుసద్భక్తితో
భావంబొప్ప భజించుచుంటినెపుడున్ బ్రాపిణ్యమేపారఁగాఁ
బ్రోవంగాఁదగువాఁడ భక్తుఁడను సమ్మోదంబునంజూడుమో
దేవా! తిర్పతివేంకటేశ్వరగురూ! దీనుండనుబ్రోయుఁడన్. 14

గీ. గురుఁడుచూపిన త్రోవను నరుగుటే, శు
భంబు శిష్యునకనియెంచి భక్తిభావ
ములను సమకూర్చివ్రాయంగ మొదలుపెట్టి
నాఁడ సౌఖ్యమ్ముగాంచుచున్నాఁడనిపుడు. 15

గీ. గురుఁడురచియించెననుచు నేనురచన నొన
రింప దొరఁకొనుటకు గర్వరేఖకలన
కాదు, యెంతటివాక్సిద్ధి కలుగకున్న
మూఢ భక్తిచే భగవంతుఁబొగడరాదె! 16

చ. ప్రతిదినమున్ బరాత్పరుల భవ్యుల శ్రీయుత దేవదేవులన్
నతియునునేనునుంగలిసి చక్కఁగఁ గొల్చుచునున్నవారమో
యతులగుణాఢ్య! యైనను సమస్తమునీవని యాత్మలోన నెం
చితినిలువేల్పవౌట నిటు నిన్నుభజించితి వేంకటేశ్వరా! 17

మ. ఇలువేల్పై తగు వేంకటేశ్వరుఁడ వెంతేనిన్ సుఖానందముల్
కలుగంజేయుచు రోగబాధలటు కూలంజేసి మద్భార్యకున్
జలనమ్మెప్పుడురాని సౌఖ్యమును నిచ్చల్ గూర్చి రక్షింపుమా
బలమున్ ధీబలమున్ వహించియెనఁగన్ బ్రార్థింతునిన్నే మదిన్.

చ. గురులపయిన్ వహించి సమకూర్చినభక్తియనిక్కమేని, నా
గురులనె దైవమంచుదగఁగొల్చిన భావమునిక్కమేని, దు
ర్భరమగురోగబాధలను బాపుమ నాదగుభార్యకున్ వెసన్
గురుబలమిచ్చిప్రోవుమ నినున్ భజియించెద వేంకటేశ్వరా!

ఉ. నీకృపమాపయిన్ బఱపి నిత్యము సౌఖ్యముగూర్చుభాగ్యముల్
మాకునొసంగిరోగమును మాయఁగఁజేయుమ నాదుభార్య వేఁ
బోకలనీదునామమునె ముందుగ భక్తిస్మరించుచుండు, లేఁ
బోఁకలపోవుమార్గమును బోధనసేయుమ వేంకటేశ్వరా! 20

ఉ. నాతనయున్ సతీమణిని నన్నును నీకరుణాకటాక్ష వి
స్ఫీతసగౌరవోన్నత విశేషవిలాసరుచుల్ వహించి, సు
శ్రీతనరంగఁబ్రోవుమిఁకఁ జేరి నమస్కృతులిచ్చుచుంటి మి
ష్టేతగురీతిభక్తిమెయి నిమ్ముగఁజూడుమ వేంకటేశ్వరా! 21

ఉ. నీవమదీయదైవమని నిత్యము వేకువ దోసిలొగ్గి సం
భావనఁజేసి భక్తిమెయిఁ బ్రార్థనసేయుచునున్నవాఁడ నో
దేవ! మహానుభావ! వెనుదీయకమానుతులన్ గ్రహించి, మ
మ్మావె, కృపాకటాక్షమున నెప్పుగఁజూడుమ వేంకటేశ్వరా!

చ. తపములుసేయఁగాఁ దగిన దార్ఢ్యములేదు శరీరమందునన్
జపములుసేయఁగాఁదగిన సత్త్వగుణంబునులేదు మాయెడన్
విపులమనఃప్రమోదమున విశ్రుతికెక్కిన నీస్వరూపమే
యెపుడుస్మరించుచుంటిమి, వహింపుమ ప్రేమను వేంకటేశ్వరా!

చ. మొలకలబాధచేఁదనువు పూర్తిగఁజిక్కె మదీయభార్యకున్
బలగుణముల్ క్షయంబుగని ప్రాణముమీఁదనునాసపోయెఁగే
వలబలహీనమై బ్రదుకు వ్యర్థమటంచును రోఁతపుట్టఁగా
వలవలనేడ్చుచుండెఁ దగు ప్రాపునుజూపుమ, వేంకటేశ్వరా!

ఉ. ఔషధసేవలన్నియును సాంతముగా నడిపించినాను, ఆ
దోషమదెట్టిదో మదికి దోఁచదు వైద్యశిఖామణుల్ సదా
పోషణఁజేయుమందులను బోయుచునుండిరి ప్రాక్కృతంపు దు
ర్దోషముచేనవన్నియుఁ బ్రదోషములైనవి వేంకటేశ్వరా! 25

చ. విసువుజనించె నామనము వ్రేఁగుచునున్నది నాదుభార్యకున్
విసువుజనించె నెమ్మనము భీతికిదావలమయ్యె, మందులున్
విసమగుచుండె ధైర్యమును వీడుచునుంటిమి తోఁచదయ్యనో
బిసరుహనేత్ర! ప్రోవుమిఁక వేగమ సత్కృపఁ వేంకటేశ్వరా!

చ. సుతుఁడును రోగబాధలకు స్రుక్కుచునుండెను నాఁడునాఁటికిన్
సతియును మిక్కుటంబగువిషాదముచేఁగృశియించుచుండె, నా
మతిచెడిపోయె భార్యకుఁ బ్రమాదమువచ్చునటన్న భీతిచే
నిష్కృతితోఁపదెట్లయిన నీవెశరణ్యము వేంకటేశ్వరా! 27

చ. సతతమువీరికై తగిన చాకిరిచేయగలేక దార్ఢ్యమున్
బతితమునయ్యె నెద్దియును నాకు స్ఫురింపదునాత్మలోనిఁకె
ద్దితెఱవు? కాలమెట్టులోగతించుచునుండె భవత్పదంబునం
దతివినయమ్మునన్ బడితి హర్షమొసఁగుమ వేంకటేశ్వరా! 28

చ. తెవులనుమాటలేక గణుతింపఁగఁజాలినశక్తినిచ్చి, యి
బ్భువనమునందు నాచిగురుబోఁడిని నాసుతునిన్ శుభంబుగా
నవిరళసౌఖ్యసంపదల నందఁగఁజేసి భవత్కృపా కటా
క్షవిధులచే నిరంతరముగావుమ శ్రీయుత వేంకటేశ్వరా! 29

చ. ఎవరెదిచెప్పినన్ వినుచు నెంతయు నౌషధసేవసేయుచున్
దెవులుతొయింపలేదని మదిన్ గడుదుఃఖమునందు మున్గుచుం
డి, వలయు ధైర్యమున్ గనక నెట్టుచునుంటిని గాలమెట్టులో
యవిరళసౌఖ్యమీయఁదగదా? యిలువేలుప! వేంకటేశ్వరా!

చ. పతిహితభక్తిచేనెలయు భామిని నాదగుభార్య; నన్ను స
మ్మతిసతిధర్మమున్ విడని మానిని చందముగూడియుండు, స
న్నుతి, పతియన్నదైవమని తప్పకగొల్చుసాధ్విగాన శ్రీ
యుతమగు సౌఖ్యసంతతుల నొప్పఁగఁగూర్పుమ వేంకటేశ్వరా!

ఉ. బాలుఁడు చిన్నవాఁడగుట బాలునితప్పులు దల్లితండ్రులే
పాలనచేయుగావలయు వాదముతోఁబనియేలనాకు? నా
బాలునిబ్రోవఁగాఁదగిన బాధ్యతనీపయి నెట్టినాఁడ, నే
లీలనుజూచెదో చెపుమ శ్రేయముగూర్పుమ వేంకటేశ్వరా!

చ. జనకుఁడునున్నకాలమున సర్వసుఖంబులఁబొందినాఁడ, నా
జనకుఁడు స్వర్గమేగఁగ బ్రసవ్యములయ్యెఁ బ్రసక్తులన్నియున్
జనకునిఁబూజసేయుటది సత్యమటంచుఁ దలంచితేని నె
మ్మనమునశాంతిగూర్పుమ ప్రమాదముగావుమ వేంకటేశ్వరా!

ఉ. ఈవెఱుగంగరాని పనులెవ్వియుసేయుటలేదు, చేసినన్
బ్రోవఁగరానివెవ్వి? యిలఁబుత్రునిగాంచెను తండ్రిరీతి నా
భావముమాటినన్ దుదకు భారమునీయదిగాన సైఁచి, యే
త్రోవనుబోవుచో శుభము దోడ్పడు సెప్పుము వేంకటేశ్వరా!

ఉ. నీమముతోడ నీపదము నేమదినమ్మి భజించుచుంటి, నా
కేమియు నాశ లేదు గమనించిన నా సతియున్ సుతుండునున్
బాములఁబొందకుండఁగనుమా, యలరోగపు బాధమాన్పుమా
సామము బోధసేయుమ ప్రసన్నగుణాకర! వేంకటేశ్వరా! 35

చ. నినుభజియించుచుందు నవనిన్ భయభక్తియుతంబుగా సతం
బును నుతియించుచుంటిని ప్రపూర్ణమతిన్ భవదీయనామమున్
మనమున నీస్వరూపమునె మాటికిమాటికి నిల్పుచుందునో
వినుతగుణప్రభావ! నను వేగరుణింపుమ వేంకటేశ్వరా! 36

చ. చదివితి నాంగ్లభాష నటుసాంతముగా పయిఁగొంత తెన్గు నా
సదమల వేంకటేశ కవిచంద్రుని యొద్దఁ బఠించినాఁడ, స
మ్ముదమున నారసింహకవిపూజ్యుని శ్రీయుతరామనాథునిన్
వదలక కొంత నేర్చితిని నన్నెటుచూతువొ వేంకటేశ్వరా! 37

ఉ. పంచమవేదమై పఱగు భారతమంతయు నాంధ్రభాషలో
మించిరచించె నెంతయును మేలగురీతిని కృష్ణమూర్తియం
చంచితకీర్తిఁగాంచిన సమర్థుఁడటంచు నుతించినాఁడ, నే
వంచనసేయ నెవ్వరిని వర్ధిలఁజేయుమ వేంకటేశ్వరా! 38

చ. తెనుఁగునఁగైతమబ్బుటకుఁ దీర్చిపఠించితి వారిగ్రంథముల్
మనమున మాటిమాటికి నమస్కృతులిచ్చుచు, వారినామముల్
పనివడి భక్తిభావములు బర్వగ జేసి జపించుచుంటి, నే
యనువుననైనఁ బ్రోవఁదగదా? యిలువేలుప వేంకటేశ్వరా! 39

చ. చదువఁగలేదు శాస్త్రములు సమ్మతిసేర్వఁగలేదు వేదముల్
చదువఁగలేదు కావ్యములు చక్కనిధోరణి లేదొకింతయున్
జదివినవిద్య కొంచెమయినన్ భయభక్తియుతంబుగాఁగ నీ
సదమలపాదపద్మమును సమ్మతిఁబట్టితి వేంకటేశ్వరా! 40

చ. తిరిగితినెల్లదేశముల దిక్కులకేగితి నీదురూపముం
గనిసితి దివ్యతేజము సమంచితభక్తిని మ్రొక్కులిచ్చి, నే
నరిగితి నాదుదేశమునకంతట నీకరుణాకటాక్షముం
బరఁగుటఁ బుత్రలాభమున వర్ధిలుచుంటిని వేంకటేశ్వరా! 41

ఉ. అంతట నాకుమారుఁగని స్వాంతమునందభిలాషమొంది నీ
చెంతకువచ్చినంతటను చేకుఱెనిట్టి సుభాగ్యమంచు నే
నంతట నీదునామము సమస్త శుభప్రదమంచుఁబిల్చినా
నెంతయు నాకుమారునటులే, యిదిసత్యము వేంకటేశ్వరా!

ఉ. పుట్టినయింటికిన్ మిగుల పుణ్యముగూర్చెను మేలుబంతియై
మెట్టినయింటికిన్ శుభముమీఱనురీతిఁజరించు సాధ్వియై
పట్టిన ప్రాణనాథు పదపద్మమువీడని భామయైదినాల్
నెట్టుచునుండె నాసతిగణింపుమ శ్రీకర వేంకటేశ్వరా! 43

చ. బలమటువచ్చినంతట శుభప్రదమౌనటు నీదునామమం
దలి మధురాక్షరంబులను దప్పక భక్తిభజించుచుండు నా
లలన, యిదేప్రమాణవిధులన్ వచియించితి నిన్నునమ్మితిన్
లలితపదంబుచేరుటకు నన్నెటుబ్రోచెదొ? వేంకటేశ్వరా! 44

ఉ. నాదగుభార్య నీపదమునందునవ్రాలుచు మ్రొక్కులిచ్చుచున్
వేదనబాధచేమిగుల వేఁగుచు స్రుక్కుచునుంటె దైవమా
బాధలుబాపుమాయనుచు భక్తియుతంబుగమ్రొక్కుచుండె, నీ
వే, దయఁజూపఁగానలయు వేగమప్రోవుమ వేంకటేశ్వరా! 45

చ. దినదినమున్ క్షణక్షణమదేపనిగా భవదీయనామమున్
బనివడి భక్తిభావమటు వర్తిలఁజేసిజపించుచుండె, వే
దనముసహింపలేక వరదా! ననుగావుమయంచు నేడ్చుచుం
డె, సదయవిధేయ! ప్రోవుమగణించిన ప్రేమని వేంకటేశ్వరా! 46

చ. పయసున చిన్నదంచన నబద్ధము లేదొకయింత రోగియుఞ్
జయమును బొందఁగాఁదగు ప్రసక్తియుఁ గాంచఁగ లేదొకింత, కీ
ర్తియు గడియింపలేదు సుదతీమణి, కావుననిప్పుడైనఁ బ్రో
చి, యలసుభాగ్యసంపదలఁ జేకుఱఁజేయుము వేంకటేశ్వరా! 47

ఉ. నిన్నటునమ్మినీ వెపుడు నేతవు, ధాతవు, కర్తవంచు, లో
నెన్నినవారికందఱకు నిచ్చితివీవు సుఖాభిలాషముల్
క్రన్ననఁబ్రోచినాఁడవు విలాసపదంబును నందఁజేయుచుఞ్
సన్నుటుచూతువో సతము సమ్మొద నెమ్మది వేంకటేశ్వరా 48

చ. పతితుఁడ దీనుఁడఞ్ బరమభక్తుఁడ శ్రీయుత వేంకటేశుఁడే
సతతము దైవమంచు విలసత్పదమిచ్చెడు బ్రహ్మమంచు, శా
శ్వతసుఖముల్ వహింపఁగల శక్తినొసంగెడు దాతయంచు న
మ్మితి నటుగొల్చుచుంటివినుమీ యిదిసత్యము వేంకటేశ్వరా!

చ. పుడమిఁజనించినందులకు భోగములఞ్ మదిగాంక్షసేయనిఞ్
విడువఁగరానిభాగ్యములు వేగమయిమ్మని బాధపెట్టనే
నడలుచునుంటి రోగమున నాత్మసుతుండటుబాధఁజెంద ని
ప్పుడు నినువేఁడుచుంటిముదముఞ్ సమకూర్పుము వేంకటేశ్వరా!

చ. తిరుపతికేగివచ్చితిని దీర్చిభజించితి నిన్ను నాత్మ సం
భరితప్రమోదవీచికల మాటికిమాటికి దూఁగినాఁడ నే
మరకసదా భవత్పదము మానక కొల్చుచునుంటి నాసుతుం
డురయమసౌఖ్యమెప్పుడుగనుఞ్ గృపఁదెల్పుము వేంకటేశ్వరా!

చ. అతిథులువచ్చినన్ మిగుల నాదృతిమైఁదగుపూజసేయనో?
సతతముసీపదాబ్జములు చక్కఁగఁగొల్చుటలేదొ? సత్యప
ద్ధతియె ప్రధానమంచు నటు తద్దయునేగుటలేదొ? యేలొకో
పతినిట్లుబాధపెట్టెదవు సమ్మతిఁబ్రోవుము వేంకటేశ్వరా! 52

ఉ. నీకరుణాకటాక్షమున నే సుతుఁడెప్పుడు సౌఖ్యమొందు న
స్తోకముగాని సౌఖ్యతతిదూఁగును భార్యయునాకునున్ సదా
వీఁకజనించునంత నినువీడక నిత్యము భక్తిపెంపునన్
నీకుపచారముల్ సలుపనేర్తుము శ్రీయుత వేంకటేశ్వరా! 53

ఉ. పాపములెన్నియో మునుపపారముగానొనరించినాఁడ, నే
పాపుఁడ మూఢచిత్తుఁడను బావనశీలమదీయభార్య, యే
పాపముఁజేయలేదు పసిపాపఁడు నాదగుపుత్రకుండు, నా
పాపమువారిపై వయిచి బాధలువెట్టకు వేంకటేశ్వరా! 54

ఉ. ఎందఱో నీకటాక్షమున నిమ్మగుజీవితమందుచున్ సుఖా
నందముఁబొందుచుండిరి మనమ్మున నీకృపరానివేళలం
దందగవచ్చునేసుఖము? నందునె మోక్షపదంబు? గాన పే
ర్మిందగనూనిప్రోవుమిఁక వేఁగుచునుంటిమి వేంకటేశ్వరా! 55

ఉ. దానముసేయఁగాఁ దగిన ద్రవ్యమునీయఁగలేదునాకు, స
న్మానముచేగురూత్తముల నైన భజించెడుశక్తిలేదు, ప్ర
జ్ఞానిధియుంగనంబడదు జ్ఞానము పూజ్యము నీపదాబ్జమే
మానకకొల్చుచుంటిఁ జనుమానమునిమ్మిఁక వేంకటేశ్వరా! 56

ఉ. నేఁకువలేచి నీస్మరణ వీడకచేయుచునుంటి నెప్పుడున్
నాకొమరుండు సౌఖ్యమున నాడుకొనందగుభాగ్యమిచ్చుచున్
నాకును నాదుభార్యకు ఘనమ్మగుమోదముగూర్చుమయ్య, నీ
వే కృపఁజూపకుండిన మఱెవ్వరుప్రోతురు వేంకటేశ్వరా! 57

ఉ. బాలుఁడు మూఁడువర్షముల ప్రాయమువాఁడు శరీరపుష్టియున్
దాల్చి యుంపలేదు సతతమ్మును రోగముచేఁగృశించుచున్
గాలమునెట్టుచుండె నొకకాలమునందును బుష్టిచేయఁడే
లీలనుగాచెదోసుతుని బ్రేమపురాశిని వేంకటేశ్వరా! 58

ఉ. నీదగునాజ్ఞ చేత ధరణిన్ వెలుగొందు సమస్తవస్తువుల్
నీదుకృపావిశేషమునసే పవనుండునువీచు నీదయన్
మోదముగల్గు; ఖేదమునుబుట్టును నీదయతప్పినంతటన్
నాదయితామణిన్ సుతుని నన్నెటుచూతువో వేంకటేశ్వరా!

ఉ. ధీరుఁడవాదిదేవుఁడవు దెల్లముగాఁగనిపించుభూత వి
స్తారములెల్ల నీహృదయసారసమందు, జగంబు నీకృపా
సారముచేవెలుంగు రసషడ్గుణముల్ గనిపించు నీయెడన్
వారకమమ్ముఁబ్రోవఁదగవా? యిలువేలుప వేంకటేశ్వరా! 60

చ. అనయముమద్గురూత్తముల నాత్మభజింతుఁబరోపకార మ
న్నను వెనుదీయనెప్పుడును న్యాయముదప్పను బంధుపూజలం
దును దగుశ్రద్ధఁబూనుదును దోషములెంచెడువాఁడగాను, స
ద్వినయమువిస్తరిల్ల నినువేఁడుచునుంటిని వేంకటేశ్వరా! 61

ఉ. ధర్మముదప్పువేళలను దండనసేయఁగరాదెనన్ను నే
కర్మమెఱుంగరాని యలకాంతనువేఁచెదవేల? పుత్రుఁడున్
నిర్మలకాంతిచేనెగడునేయని నిన్నెదఁ గొల్చుచుంటి, దు
ష్కర్మముగూర్చిఁబోక కృపఁగావుమ శ్రీకరవేంకటేశ్వరా! 62

ఉ. ఇంతగవేఁడుచుంటి నిను నెంతయుఁ బ్రార్థనసేయుచుంటి, నా
యింతియునిన్ను నాత్మభజియించుచునుండెను భక్తిపెంపు న
త్యంతమునూపి, నాసుతుఁడు దార్ఢ్యముగాంచెడుశక్తినిచ్చి, నా
యింతికిసౌఖ్యమిచ్చి కరుణింపుమ నన్నిఁక వేంకటేశ్వరా! 63

ఉ. స్వాంతమునందు నీప్రతిమ వర్తిలఁజేసినుతించుచుంటి న
శ్రాంతముభక్తితోడననురాగమునూపుచుమమ్ముఁబ్రోవుమా;
యంతముఁజేయుమాదుతితమంతయుఁ గోపమునంహరింపుమా
యింతగవేఁడినన్ గృపరాకెంతయుఁరాదొకో? వేంకటేశ్వరా!

ఉ. ఇచ్చితివీవుభక్తులకు నెన్నఁగరానిసుభాగ్యసంపదల్
మెచ్చియొసంగుచుంటివల లెక్కకుమించిన భోగభాగ్యముల్
యిచ్చవహించి సౌఖ్యమటులిచ్చినఁజాలునుమాకు, రోగముల్
చెచ్చెరమాన్పుమాదరికిఁ జేరఁగఁదీయుమ వేంకటేశ్వరా! 65

ఉ. ఏలొకొ నాసతీమణివహింపదు సౌఖ్యమునొక్కకాలమం
దేలొకొ నాసుతుండుగ్రహీయింపఁడు పుష్టియొకింతయేని, నా
కేలొకొ ధైర్యముంగలుగదెంతయు నీకరుణావిశేష దృ
గ్జాలముమాపయిం బఱపి కావఁగరాదొకొ? వేంకటేశ్వరా! 66

ఉ. ఆయువువృద్ధిఁజేయుమని యాదృతిమై నినువేఁడలేదు, నా
కాయువునెంతదాఁక ధరయందునఁగల్పనఁజేసినావొ, యా
ప్యాయముతోడ నంతవఱకాయతమైన సుఖంబునిచ్చినన్
హాయిగనుందునాకదియ హర్షమొసంగును వేంకటేశ్వరా! 67

చ. అనయమునీపదాంబుజము ధ్యానముసేయఁగ మాననెప్పుడున్
వినికనరానిపల్కు లవివేకముచేతనునాడఁబోను, చిం
తనమొనరించుచుంటి శుభదాయకమైన భవత్ప్రసక్తి, కా
వుననను గావుమా సతిని బుత్రుని బ్రోవుము వేంకటేశ్వరా! 68

చ. సలుపుచునుంటి ధర్మగుణసంగతిఁజూపెడు దేవతార్చనల్
సలుపుచునుంటి న్యాయమనుసంగతిమీఱెడు కార్యముల్ సదా
సలుపుచునుంటిఁబద్యములు సారసనేత్రుఁడవైన నీపయిన్
జలనములేనిసౌఖ్యములు సమ్మతిఁగూర్పుమ వేంకటేశ్వరా! 69

ఉ. ఏదెటులైననిన్ను మదినెంతయునమ్ముచు ధైర్యమూనుచున్
వేదనబాధలన్ సయిచి నిన్నెదనిత్యము సంస్మరించుచున్
మోదముఁజెందుచున్ సుఖముఁ బూర్తిగనిమ్మని భక్తితో గుణ
శ్రీదయివారివేఁడితిని శ్రేయముఁగూర్పుమ వేంకటేశ్వరా! 70

ఉ. నిన్నదనమ్మినీపయిని నేశతకంబు రచింపఁబూనితిన్
నన్నెటుచూచి పూర్తియగు నంతటిశక్తి నొసంగిప్రోతువో?
మన్ననసేతువో ప్రియము మాటికినిత్తువొ? చెప్పవేఁడెదన్
విన్నపమాలకించి ననువేగరుణింపుము వేంకటేశ్వరా! 71

చ. అఱువదియాఱుపద్యములు వ్యాకులచిత్తముతో రచించితిన్
గరముప్రియమ్ముఁజేసి నినునమ్మితిగావున సంభ్రమంబుతో
నఱువదియాఱుపైన మనమందున హర్షముపొంగివచ్చె, నీ
కరుణనుగాంచినన్ గొదవకల్గునె? నాకిఁక వేంకటేశ్వరా! 72

చ. శతకమువ్రాయనెంచితిని సత్యముఁజెప్పెద నీకటాక్ష దీ
ధితిప్రసరించినన్ గలుగదే? తగుశక్తిరచింపఁ బూనినన్
సతతమునిన్నునమ్మిన, లసత్పదమున్ లభియింపదేతుదిన్
యతినముజేసితీగతిని హర్షముగూర్పుము వేంకటేశ్వరా! 73

చ. శతకమువ్రాసినంతట ప్రశాంతముగల్గునటంచు నమ్మితిన్
శతకమువ్రాయఁగాఁదగిన శక్తియు నాయెడలేదుగాని, స
మ్మతి నినుఁగొల్చినంతట సమంచితధైర్యముగల్గె నీకటా
క్షతతులు చిల్కినంతటఁ బ్రసన్నతగాంచితి వేంకటేశ్వరా! 74

ఉ. భోగముగాంక్షసేయ పరిపూర్ణసుఖంబును కాంక్షసేతు, ను
ద్యోగముగాంక్షసేయను మహోన్నతదివ్యపదంబుగోరఁగా
రాగముసూపెదన్ మిగుల రాగముఁజేసియశంబునేగతిన్
రాఁగలదోయటుల్ మనుపరాదొకో? శ్రీకర వేంకటేశ్వరా! 75

ఉ. భారమునీపయిన్ వయిచి భార్యయుఁబుత్రుఁడునున్ సుఖంబులన్
వారకగాంతురంచు మదినమ్మితి నీశతకంబువ్రాసితిన్
గోరితినింతకాలమునకున్ వరమొక్కటి నిన్ను సౌఖ్యమే
కోరితిగాని వేఱొకటి గోరఁగలేముగ వేంకటేశ్వరా! 76

ఉ. భాగ్యనిధానమూర్తివని భక్తులకెల్లెడ సౌఖ్యలీలలన్
యోగ్యతఁగూర్చువాఁడవని యుత్తమలోకసుఖంబులియ్యఁగా
భాగ్యవిశేషరాశివని ప్రాజ్ఞులు నిన్నిటుగొల్చుచుంద్రు నా
యోగ్యతమంచిదైన హితమూనుమ బ్రోవుము వేంకటేశ్వరా!

ఉ. నీకృపలేనిజీవితమునే ధరియింపఁగనేల? యిద్ధరిన్
నీకృపపెంపుగాంచక గణించెదు వేఱొకభాగ్యమెద్ది? స
త్ప్రాకటభక్తియుక్తి తనరంగ నినున్ భజియించుచుంటి న
స్తోకములైనసౌఖ్యములఁ దూఁగఁగఁజేయుము వేంకటేశ్వరా! 78

ఉ. సాహసవృత్తిఁబూని పెలుచన్దనమూనిరచించెనంచు సం
దేహమునుంచఁబోక కృపనింపుమనాపయి నెట్టివేళలన్
ద్రోహముసేయుబుద్ధి మదిఁదోఁచఁగనీయను నెమ్మనమ్మునన్
నీహృదయాబ్జమేకొలుతు నిక్కముసుమ్మిది వేంకటేశ్వరా! 79

చ. శతకము పేరుపెట్టి నినుసంస్తుతిఁ జేసెడుభాగ్యమబ్బె, స
మ్మతినిటులైన నీపదముఁబట్టెడు భాగ్యముగాంచినాఁడ, సం
తతము మదీయజిహ్వపయి నాట్యముసేయుమ కైతమందు స
త్ప్రతిభగడించు భాగ్యమలరన్ సమకూర్పుమ వేంకటేశ్వరా!

చ. ఎఱిఁగియెఱుంగకేయిటుల నెన్నితినిన్నిటు మూఢభక్తిచే
గరమనురక్తిఁబూనిననుఁ గావుమనాదగుభార్యఁ బ్రోవుమా
వరమొకటిమ్మ నాసుతుని వర్ధిలఁజేయుము పెంపుగూర్పుమా
సురుచిరసౌఖ్యసంపదలు శోభిలఁజేయుము వేంకటేశ్వరా! 81

చ. చదువదికొంతనిచ్చితివి చాలుననాకది తెన్గుకైతమం
దుదగులు బుద్ధినిచ్చితివనూనకృపన్ సుతలాభమొందఁగా
సదయతనిచ్చినాడవిఁకఁజాలును భాగ్యసుసౌఖ్యమిచ్చినన్
వెదకినలోటునాకు గనుపింపదిఁకెన్నఁడు వేంకటేశ్వరా! 82

చ. అనుపమభక్తితత్పరతమైఁ దగుసేవలుచేయుచుంటి నీ
కనియతిఁబూని నిన్నెపుడు గోరిభజించుచునుంటినెమ్మనం
బున భవదీయనామమునఁ బుత్రునిఁబిల్చుచునుంటినిచ్చలున్
నినుఁగొనియాడుచుంటిఁ గరుణింపుము సన్నుత వేంకటేశ్వరా!

ఉ. వేయివిధంబులన్ నిను బవిత్రమనమ్మున గొల్చుచుంటి న
న్నోయికమాఱియంచు హితమూనుచులాలనసేయరాదె? యా
ప్యాయముతోడఁ బోషిపఁగదవయ్య సతీసుతులన్ సుఖంబుగా
శ్రేయమువేగనాకు దయసేయుము శ్రీపతి వేంకటేశ్వరా! 84

ఉ. వేఁడుచునుంటినిన్నుఁ గృపపెంపునుజూపుమటంచు నాపయిన్
బోడిమియున్ సుఖంబును బ్రపూర్ణముగాదయతోడనిమ్మ యే
నాఁడును నిన్నుఁగాదని మనమ్మున నన్యమెఱుంగ; జిహ్వయం
దాడఁగఁజేయుమా భవదనంత ప్రసక్తిని వేంకటేశ్వరా! 85

చ. సిరియును సంపదల్ గలిగెఁ జేకుఱెఁగైతమునందునేర్పు సు
స్థిరతరసౌఖ్యసంపదలచేఁ దులదూఁగెడు భాగ్యమిచ్చినన్
మఱిమఱిసేయఁ బ్రార్థనలు నాకదియబ్బినఁజాలునెమ్మదిన్
మఱవకనిన్నుఁగొల్చెదను మాటికిమాటికి వేంకటేశ్వరా! 86

ఉ. మాటికిమాటికిన్ సుతుఁడుమాంద్యముచేఁగృశియించుచుండెనా
బోటియు రోగబాధలకు బూర్తిగజిక్కెసుఖంబులేదు; యిం
కేటికి జీవితంబనుచు నెంతయురోఁతజనించెనాకు, న
న్నేటికిఁబుట్టఁజేసితొ గ్రహింపఁగనేను వేంకటేశ్వరా! 87

ఉ. గెంటుచునుంటిఁగాలమెటొ కిమ్మనకుండ శరీరబాధకున్
మంటలువెట్టుచుండెఁ గృపమాపయిఁజూపఁగరాదొ? మంటికిన్
గంటికినేకధారలలొలుకన్ బ్రవహించెడు బాష్పపూరముల్;
జంటను బాపఁగాఁదగదు నారసలోచన వేంకటేశ్వరా! 88

ఉ. పంచమవేదమై పఱగు భారతమంతయు బూర్తిచేసితిన్
మంచిఫలంబు నీకతన మాకు లభించు నటన్న యాశతో
నెంచుచునున్న వారమిటు నెంతయు భక్తిని కాసమొందఁగాఁ
బెంచియు బెద్దఁజేసి యిటు వీడఁగ న్యాయమె? వేంకటేశ్వరా! 89

ఉ. బమ్మెరపోతరాజకృత భాగవతంబు మదీయభార్య తా
నెమ్మియి భక్తిభావములు హెచ్చఁగ శ్రద్ధఁ బఠించె నంతయున్
నమ్మకముంచి నీయెడ ననారతమున్ భజియించుచుండె, సౌ
ఖ్యమ్ములుగూర్చిప్రోచెదవొ యాత్మదలంపుమ వేంకటేశ్వరా!

చ. తిరుపతి వేంకటేశ కవిధీరుల గ్రంథము లెన్నియూఱులో
కరము నురక్తిఁ బూని తమకంబున భక్తిఁ బఠించినాఁడ నే
మఱిక నృసింహసత్కవి సమంచిత గ్రంథములన్ బఠించి నా
నురకవి శేషభక్తిమెయి నో జగదీశ్వర వేంకటేశ్వరా! 91

ఉ. మానిని నీపదాబ్జములె మానక నిచ్చలుగొల్చుచుండు ని
న్నే నయభక్తిభావమున నెంతయు నాత్మస్మరించుచుండె స
న్మానములియ్యమంచు నిను మాటికిఁగోరదుగాని సౌఖ్యమే
తానదికోర్కెలూరఁగ సహామతిఁగోరెను వేంకటేశ్వరా! 92

చ. కొలిచితిఁ బద్యరూపమునఁ గోరికలేరిక నెత్తునట్లు నిన్
గొలిచితి భక్తిభావములు గూర్చి సతీసుతులం సుఖంబుగా
నిలిపెదవంచు నీదుకృప నిక్కముగాఁ దయచేతువంచు మి
క్కిలియగు యాశలన్ దగులకే నినుఁగొల్చితి వేంకటేశ్వరా!

ఉ. నిద్దుర లేదు రాత్రి గణించిన నొక్కక్షణంబునైన నా
వద్దకు వచ్చి నాసుతుఁడు వల్వలనేడ్చుచునుండు బాధచే
ముద్దియయున్ విషాదమున మున్గుచునుండును నిట్టి రోగమా
పద్దశఁగూర్చునా యనుచు; వారక ప్రోవుమ వేంకటేశ్వరా! 94

ఉ. పద్యములన్ రచింపఁగ శుభంబగునంచు లిఖించినాఁడనే
గద్యమువ్రాయకిట్లు శతకంబురచించి స్తుతించితిన్ గదన్
హృద్యముగాఁగ నీకథలనేపలుమాఱు విశేషభక్తితో
సద్యశమున్ వహించెదు ప్రసక్తినొసంగుము వేంకటేశ్వరా! 95

చ. చదువదికొంచెమౌట నినుసన్నుతిఁజేయ దోసంగులుండు, నే
నదిగ్రహియించియున్ మిగుల హర్షముతో నినుఁగోరి సంస్తుతిం
చెద దోసగుల్ ప్రమాదమునఁజెందిననీవది లెక్కసేయకే
సదమలపేర్మిఁజూతువని సాగితినిట్టుల వేంకటేశ్వరా! 96

చ. తిరుపతి వేంకటేశ కవిధీరుఁడుచూపిన మార్గమందునే
నరిగినక్షేమమంచు మనమందుననెంచి రచించినాఁడ, నీ
శ్వరనిస్తుతించి వ్రాసిరటు వారదినాకనుబంపఁగానదే
తెలుగుననీపయిన్ రచన తెన్నునఁజేసితి వేంకటేశ్వరా! 97

ఉ. వారెటువ్రాసిరో యటులవ్రాసెడు శక్తియులేదునాకు, న
న్వారకవారుప్రోచుటను నన్నొద శిష్యునిఁగానెంచుటన్
వారిపయిన్ వహించు నలభక్తియె నన్నిటుప్రోత్సహించుఁ
నేరచియించినాఁడ నిదినిక్కమునమ్ముము వేంకటేశ్వరా! !

ఉ. వారికృపావిశేషమున వ్రాయఁగఁజాలితి నానమస్కృతుల్
వారికినిచ్చెదన్ మిగుల భక్తివినమ్రతతోడనామదిన్
వారిస్వరూపమేసిలిపి వారలె దైవసమానులంచు వి
స్తారముగాభజించెదను సౌఖ్యముఁగాంచఁగ వేంకటేశ్వరా! 99

చ. వరగుణధాముఁడై వెలసి భవ్యచరిత్రనుగాంచి ధాత్రిలో
వరములనిచ్చువేల్పనుచు భాగ్యనిధానపుమూర్తియంచు సు
స్థిరతరకీర్తిగాంచుచుఁ బ్రసిద్ధివహించినవానినెప్పు నే
మరక భజించెదన్ చిలకమర్తి నృసింహుని వేంకటేశ్వరా!10

చ. తెనుఁగున కైతముల్ రచనఁదీర్చుచు మార్గముఁ జూపినన్నె దన్
దనయునిరీతిఁ జూచి సతతంబు కవిత్వవిశేషధర్మముల్
మనమున కెక్క బోధనలు మాటికిమాటికిఁ జేసినన్నుఁ బ్రో
చినయల రామనాథకవిసింధుని గొల్చెద వేంకటేశ్వరా! 101

ఉ. రాజగులక్ష్మరాడ్విభువు రాగముమీఱఁగ గారవించి నా
పైఁ జిలికెన్ దయారసము; వర్ధిలజేయఁగ రత్నమాంబ న
న్నోజగృహావిశేషమున నున్నతసత్పదమందు నిల్పి వి
భ్రాజితభోగభాగ్యములరన్ దగనిచ్చెను నేంకటేశ్వరా! 102

చ. తనయునిరీతి నన్నుద సతంబు ప్రియంబునజేసి చూచి, బ్రా
హ్మణులనభక్తియున్ గలిగి మన్ననసేయుచుఁ బ్రోచుచుండె స
ద్వినుతయశంబు గాంచె గుణవిశ్రుతరాణియనంగ బేరువ
చ్చెను సుఖమిచ్చి నన్ను దరిజేర్పుము శ్రీపతి వేంకటేశ్వరా!

చ. కొదవనుమాటలేదెపుడు కొల్లపురమ్మున రత్నమాంబ నా
కొదవినభాగ్యమున్ దినుచు నోజదలిర్ప శుభప్రదమ్ముగా
ముదముననున్నవాఁడఁ బరిపూర్ణసుఖంబు నొసంగినంతటన్
వదలక నిన్నుఁ గొల్చెదను భక్తియుతంబుగ వేంకటేశ్వరా! 104

ఉ. దీక్షవహించి వ్రాసితి నిదే శతకంబు భవత్సహాయము
జ్జేక్షణకోరుచున్నది గ్రహింపుము నాసుతుప్రేమవాక్యముల్
ఈక్షణమే భవత్కృపవహించిన భాగ్యముగల్గెనేని మే
మక్షయసౌఖ్యసంపదల నందినవారమె వేంకటేశ్వరా! 105





శ్రీమత్పరదేవతాయైనమః.

# ఆరోగ్య రాజరాజేశ్వరి శతకము.




# ఆరోగ్య రాజరాజేశ్వరీ శతకము.

శా. శ్రీ కాత్యాయని! నీదయాకలనచే క్షేమంబునన్ జూచి, నా
మీఁదన్ బ్రేమరసంబుఁజిల్కఁ గవనంబే భాగ్యమంచిచ్చుటన్
మోదంబొప్పరచింపఁగల్గితిని సంపూర్ణంబుగా నీవనా
కాధారంబనినమ్మియుంటిఁ గనుమంబా! రాజరాజేశ్వరీ! 1

శా. ధ్యానంబందున నీపదాబ్జములె సంభావించి పూజించి స
ద్భానంబందున భక్తినిల్పి మదిలోఁ దాత్పర్యమే పారఁగా
నీవే మాకులదైవమంచు మిగులన్ నేర్పొప్పఁగా మ్రొక్కుచున్
సేవల్ చేయుచునున్నవాఁడ నెపుడున్ శ్రీరాజరాజేశ్వరీ! 2

శా. ఒక్కొక్కప్పుడు సంసృతిన్ దగిలి మాయోపాయపాశంబులన్
జిక్కుల్ చెందుచు మాయలీలలవడిన్ జీకాకులన్ జెంది, యే
ఫక్కిన్ గానఁగలేని మూఢులగతిన్ బాల్మాలితిన్ తల్లి! వే
చక్కన్ జేయుమనాదుశ్రోత్రవవిధులన్ శాసించి రాజేశ్వరీ! 3

శా. నీవేతల్లివటంచుఁ దండ్రివనుచున్ నీవేగురుండంచు నా
దైవంబంచు సమస్తమంచు నెడఁదన్ దాత్పర్యమొందేనియున్
దైవారంగ భజించుచుంటి నెపుడున్ రక్షించిహా సంగదే
శ్రీపదిల్లఁగఁ జేసిసౌఖ్యమిడుమన్ శ్రీరాజరాజేశ్వరీ! 4

శా. నిన్నే నెమ్మనమందు నిల్పి సతమున్ నేర్పొప్పఁ బూజించి నీ
సాన్నిధ్యంబును గోరుచుంటిఁ ద్వరలో సంప్రాప్తున్ జేసివే
మన్నింపంగదె నా దోసంగులను సంభావించి లాలించుచున్
విజ్ఞానంబగు నీపదాబ్జభజనంబే సేతు రాజేశ్వరీ! 5

శా. మాయాలీలలఁ జిక్కి లేశమును నీమాటన్ స్మరింపంగలే
దాయాసంబును జెందుచుంటి వినుమంబా! ధైర్యమున్ మాటనా
కాయంబందున లేదు వేఱుగతియున్ గన్పింపదాయెన్ లస
చ్ఛ్రీయః ప్రాప్తి నొసంగి ప్రోవఁగదవే శ్రీరాజరాజేశ్వరీ! 6

శా. సారాసారవివేకమున్ దెలియఁగా సామర్థ్యమున్ లేదు వి
స్తారంబైన యశంబు గాంచనయితిన్ ధర్మంబుఁ జేయంగలే
దారూఢప్రభఁ గాంచనైతి మనమందానందమున్ లేదు త
ల్లీ! రాణించెడు జీవితంబొసఁగుమా శ్రీరాజరాజేశ్వరీ! 7

శా. రాణిన్ వేంకటరత్నమాంబ జననిన్ బ్రార్థించి సౌభాగ్యసం
ధానంబందితి లోటులేదెపుడు సంతానప్రమోదంబహో
నేనందందగు భాగ్యమిచ్చితివి నిన్నే గొల్తు నెల్లప్డు, సౌ
ఖ్యానందంబును గూర్పుమింక జగదంబా! రాజరాజేశ్వరీ! 8

శా. నేరంబున్న యెడన్ శమించి యెటులో నీవే దయన్ బ్రోచి వి
స్తారంబైన కటాక్షధీధితుల నశ్రాంతంబుఁ జిల్కంగ ని
న్నారాధింతు మనంబులోన సత మాహ్లాదంబునందూఁగఁగా
శ్రీరమ్యంబగు సత్పదంబొసఁగుమా శ్రీరాజరాజేశ్వరీ! 9

శా. ప్రారబ్ధంబున దోషముల్ కలిగె సంప్రాప్తించెదానన్ మహా
దారిద్ర్యంబను వ్యాధిగా నమదిలో ధైర్యంబునున్ బోయె, నా
ధారంబెద్దియు లేదు నీదు కరుణాతాత్పర్యమే నాకు శో
భారమ్యంబగు దిక్కు నీశరణమే ప్రాప్తంబు రాజేశ్వరీ! 10

మ. జననంబందినదాదినేఁటిదనుకన్ సంసారమేనమ్మి స
ద్వనితాసౌఖ్యమెశాశ్వతంబనియెదన్ భావించితిన్ మూఢతన్
నినునజ్ఞానముచే స్మరింపనయితిన్ నేరంబుసైపంగదే
యనురాగంబునఁజూడరాదె? జగదంబా! రాజరాజేశ్వరీ! 11

శా. నేనెల్లప్డు విరాగమార్గమున సంధింతున్ గదా నెమ్మదిన్
నేనెల్లప్డువికాసబీజములె సంధింతున్ గదా యిప్డు సౌ
ఖ్యానందంబును గల్గకుండుటకునంబా! కారణంబెద్ది? ని
న్నేనెంతేని భజించుచుంటిమదిలో నెవ్వేళ రాజేశ్వరీ! 12

మ. చదువన్ లేదల వేదశాస్త్రములు సత్సాంగత్యమా లేదు, నీ
పదపద్మంబులెనమ్మినాఁడ సుగుణప్రాప్తంబెటో కూర్చి న
న్నైదప్రోవంగదవమ్మనాదొసఁగుమన్నింపన్ గదమ్మా! మునుల్
వెదకం లేనిలసత్పదంబిడుము దేవీ! రాజరాజేశ్వరీ! 13

మ. తపముల్ చేసెడిశక్తిలేదు మదిలో దార్ఢ్యంబులేదెంతయున్
జపముల్ చేయఁగ దానధర్మగుణముల్ సల్పంబ్రయత్నింపఁగా
నిపుడేమాను ధనంబులేని కతనన్ హింసింపఁగారాదు యే
విపరీతంబగు త్రోవఁబోనిపదమే వీక్షింతు రాజేశ్వరీ! 14

మ. జననంబందుట జ్ఞానమందుటయు సంసారంబునందుంట నం
దనులంగాంచుట పెద్దచేయుటయు విద్యాబుద్ధులన్ జెప్పుటన్
ధనమార్జించుట పెండ్లిసేయుట యిటే ధర్మంబునేగున్ గదా
నినుఁగొల్వందగుకాలమేది? చెపుమా నిక్కంబు రాజేశ్వరీ! 15

మ. నినుఁగొల్వం సుఖమందఁగాఁగలరు నిన్నేనమ్మిసౌభాగ్య సా
ధనముల్ గాంతురు ధర్మమార్గవిధులున్ దథ్యంబుగాఁగల్గు, నె
మ్మనమందున్ నినుఁబూజచేసినయెడం బ్రాప్తింపదే ముక్తి; నీ
చనవున్ గల్గినవేళలందున సమస్తంబుండు రాజేశ్వరీ! 16

శా. ఇల్లుం గట్టియొకండు సౌధమును నిర్మించి బరుండుం సుసం
పల్లాభంబునుబొంది హర్షమును గూర్పంబూనుచుండ్రినరుల్
కొల్లల్ గాగ ధనంబుఁగూర్చుదురుగా కుక్షింభరార్థంబుకై
తల్లీ! నీపదమందుఁజేర్పఁదగదా? ధ్యానింతు రాజేశ్వరీ! 17

శా. ఆచారమ్ములుమంటగల్పి కులధర్మాచారముం రోసి దు
ర్ధీచాతుర్యబలమ్ములూని తగవందేకాలముం బుచ్చుచుం
నీచాత్ముల్ గుణధర్ముముల్ విడుచుచుం స్వేచ్ఛావిహారాత్ములై
యేవోటుం గనరారిదేమిరసమో? హీనంబు రాజేశ్వరీ! 18

శా. వాదంబందునఁగాలముం గడపి సద్వాక్కుం విసర్జించి స
మ్మోదంబుం గనలేకధర్మవిధులం బోనాడిమూఢాత్ములై
యీధాత్రిం నశియించిపోవుదురుగా యేమిం గనం లేకయే
వాదంబుం సలుపంగఁబోను జగదంబా! రాజరాజేశ్వరీ! 19

మ. మునులుం ధర్మపరుల్ విశుద్ధచరితుల్ పుణ్యాత్ములుం జ్ఞానులుం
గనఁగాలేనిభవత్పదాబ్జమెటులేఁ గాంక్షింపఁగానేర్తు? నో
జననీ! మూఢుఁడ జ్ఞానశూన్యుఁడను సత్సాంగత్యముం లేదటై
నను నీపాదముఁబట్టినాఁడ గుణమెన్నంజూడు రాజేశ్వరీ! 20

శా. శ్రీలంగాంతివహించు నీపదములం సేవించుచుండంగ న
న్నేలా? మాటికిమాటిమాటికిని రక్షింపం బ్రయత్నింపవో
బాలార్కత్నమ! నీవదిక్కనుచు నిం భావింతు నెల్లప్పుడుం
మేలందందగు సత్కృపాకలన నన్నేలంగదే మ్రొక్కెదం. 21

శా. ఏపాండిత్యము లేదునాకు మనమందీనాఁడుసంతోష మెం
తో ఫుట్టం రచియింపఁగల్గితిని నోహా నీసహాయంబుచే
లోపంబున్నయెడం క్షమించినను నీలోఁజేర్చి రక్షింపవే
ప్రాపైయిందున నందు నంద్రి జగదంబా! రాజరాజేశ్వరీ!22

